ఈ రచయితవే

కథలు

బానిసల దేశం

నాటకం

మందీ-మనిషి

కవిత

కాహళి

వజ్రాయుధం

గోదావరి జలప్రళయం

రక్తాక్షి



1958

కళాకేళి పబ్లికేషన్సు,

సామర్లకోట.



- అంకితం:

మా అన్న

కీర్తిశేషుడు

కాళ్ళ్యారి శేషగిరిరావు

సంస్మరణకు



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 6 | రక్కాస | రక్కసి |
| 9 | 15 | స్దలము | స్థలము |
| 17 | 10 | సద్లు | సద్దు |
| 18 | 14 | అరకన్ని | అరకల్ని |
| 20 | 4 | చమవుకోసమై | కోసమై |
| 20 | 19 | పుడమికిడుముఖబాసి | పుడమికిడుములు బాపి |
| 21 | 1 | ప్రతిష్టిస్తా | ప్రతిష్టిస్తాను |
| 24 | 2 | వ్రేలాడివడి | వ్రేలాడపడి |
| 25 | 2 | మట్టలో | మట్టల్లో |
| 30 | 8 | వాలకవాటాల్ని | వాల్కవాటాల్ని |
| 37 | 17 | పరధర్మా | పరధర్మో |
| 38 | 19 | మోక్షయిష్యామి | మోక్షయిష్యామి |
| 39 | 13 | మందూ | మందూనా |
| 41 | 10 | బుద్దులై | బుద్ధులై |
| 42 | 2 | నంభోవీధి | నంభోవీధి |
| 54 | 11 | పలుశమురల | పలుశరముల |
| 58 | 7 | ఆడి | ఆధి |
| 58 | 11 | విలానస | విలాసనంపద |
| ,, | 20 | జనములతో | జనములలో |
| 63 | 8 | శేవకే | శేవరా! |
| 66 | 11 | వనలనుమించగా | నుమించ |
| 67 | 8 | మైత్రణి | మైత్రది |
| 69 | 2 | ఫురుషు | పురుషుల |
| 70 | 11 | క్రమపద్దతి | కలబద్ధతి |
| 73 | 20 | ముండు | ముందగతి |
| 74 | 13 | ప్రజాభ్య | ప్రజాభ్యః |
| 74 | 14 | మహాన్మహే | మహిమ్మహేశాః |
| ,, | 15 | న్నఖి | న్నఖి |



కావ్యాలు .... వ్రాసుకుంటానులేరా
గంధాలు .... పూసుకుంటానులేరా !

రంగురంగుల పూలు - రసధునీహాసాలు,
తేటిపాటలు వేలు దేదీప్యమానాలు,
హరితకాంతులజాలు - హరిణార్ద్రనయనాలు,
పుడమితల్లివరాలు - పడతిమోదుగచూలు,

కావ్యాలు .... వ్రాసుకుంటానులేరా !
గంధాలు .... పూసుకుంటానులేరా !

వసుధ నాలుగుదెసలు పసిడిపూసిన రేయి -
వగపుతో నగమైన ఎడదసొక్కిన హాయి,
కౌముదీహాసమున పులకించు జవరాలు -
మనుగడకు తోచిన విహాయనవిహారాలు,

కావ్యాలు .... వ్రాసుకుంటానులేరా !
గంధాలు .... పూసుకుంటానులేరా !

మల్లెమనసున మరగు నవవసంతపు రుచులు,
ఇల్లాలి హృదయాన తూగు కోరికకొనలు,
కల్లకపటాల విలువల లోకసంపదలు,
ఉల్లమల్లల్లార్చు మనిక తలపుల వలలు!

కావ్యాలు .... వ్రాసుకుంటాను లేరా!
గంధాలు .... పూసుకుంటానులేరా!



# సచ్చిదానందం

## ౧. సత్

బ్రతుకుతోట బాటలోన
మెతుకు వెదకు చోటులోన
ఏమిటవీ ?
మొలిచినవీ, నిలిచినవీ
ఏమిటవీ ?
రక్కసతుప్పలు కావవి;
రక్కస మీసాలు సుమీ!

కానీషా తమాషాల
కాషామర్భాల నిషా—
గమ్మత్తులు .... కమ్మిచ్చులు,
ఐచ్చుకత్తు లుచ్చులకా!
ఏమిటవీ ?
తెగిపోయిన పడిపోయిన
కుత్తుక తుత్తునియలకా!
ఏమిటవీ ?
హుక్కాగొట్టం లోపలి గుడగుడ చప్పుళ్లనుమీ!
దిక్కులేనిబతుకు టిరుసుకటకట నవ్వుళ్లనుమీ!

ఇతిహాసం కడుపులోన పేగులరవు
లేమిటవీ ?
దామాషా పాదుషాల ఫర్మానా
వెతపినరుల పరువులపై జుర్మానా!
ఏమిటవీ ?
ఉతికంబం నీడల్లో ఉరోజాల జాడలు
బండ రాతి గుండుమీదపగిలినతలకాయలు.

పాలబాట — పూలతోట
జగతీపతి పసిడికోట
బురుజులపై ...
గురుజులపై ...
ఎత్తుతున్న వేమిటవీ ?
హత్తుకున్న వేమిటవీ ?
నెత్తురోడిన వ్రేలాడిన

లేనివాళ్ళ కపాలాలు !

దట్టంగా ఛోంచేసిన
వస్త్రంగా వేంచేసిన
పల్లెటూరి పెద్దరైతు
పొన్నుకర్ర విరిగిందా !
ఏమిటవీ ?
కూలివాని వెన్నుమిద ...
పాలికాపు వీపుమీద ...
ఏమిటవీ ?
రక్తం చిమ్మిన చారలు ...
చర్మం చిట్లిన తట్టులు ...
ఆశ్చర్యం దేనికిలే -
అతిసాదా కథలేనుమీ !

ఏమిటవీ ?
చక్రవర్తి వాహ్యాళికి నిర్ణీతస్థలములా
జీవితకైవారంలో నందనవనభూములా
ఏమిటవీ ?
ఆశ్చర్యం దేనికిలే ... ?
కడుపుమంట ... స్వేదజలధి ...
కంటినీరు ... నెత్తురేరు ...
ఆశ్చర్యం దేనికిలే
అతిసాదా కథలేనుమీ !

## ౨. చిత్

స హా రా
స హా రా
దాటుమిదే పహారా !

లోకాలోకం నీకిది,
చీకాకుల చింతనం;
చింతాకుల చిరంతనం,
దాటుమిదే వ్యాకులం !

బ్రతుకు కోట
అతుకు గోడ
ప్రహారీల దీవారం
దాటుమిదే ప్రాకారం !

కందకం
కంపకం
దాటుమిదే పాతాళం !

నెత్తురున్న ...
కత్తులున్న ...

పేకలున్న కందకం,
బాకులున్న కంపకం;
పాతకాల పాతకాలు
దాచుకున్న మందసం -
చాటుమిదే భూతలం !

హిమాలయం
తుహినజలం
చాటుమిదే పంకిలం !
వైతరిణీపరీవృతం,
చాటుమిదే సంకులం!

సంకులం
పంకిలం
చాటుమిదే జీవితం;

జీవితం
జీవితం
రహదారీ పడవనడక లీదినం
ఎత్తునుతే ...
ఆశలలో
తెరచాపల జీవితం !

జీవితం
జీవితం

ఎడారిఓడ జీవితం,
మరీచినీడ జీవితం!
వేయునులే ...
వడివడిగా ...
అడుగుజాడ లీక్షణం!

పంకిలం
సంకులం
దాటుమిదే జీవితం

స హా రా
స హా రా
దాటుమిదే పహారా !

## 3. ఆనందం

రేయిలో ... వానలో ...
ఏర్లులో ... నావలో ...
రేయిలో ...
నావలో ...
కానలో ... వానలో
వాగులో ...
ఎక్కడికీ ప్రయాణం?
చిక్కులేని దాలోకం!

వేచుకున్న కన్నులతో,
పేల్చుతున్న గన్నులతో,
కన్నులతో ...
గన్నులతో ...
ప్రయాణం - ప్రయాణం
ఎంతవరకు ప్రయాణం?

పొదలు లేని ...
చెరలు లేని ...
చీకులేని ... రోతలేని
సమతల మా భూలోకం!

మంచి జనం ...
మంచజనం ...
మనలినారు కోటిజనం ;
తొందరగా ....
తొందరగా ....
ఎందులకీ ప్రయాణం ?
— సందడిగల జీవనదం;
— సంబరాల కొత్తపొలం

అనంతమిది మహాయాత్ర ....
అన్నార్తుల జైత్రయాత్ర ...
ఎక్కడికీ ప్రయాణం ?
కరువులేని ....

వెరపులేని ....
చక్కని దా ప్రపంచం !
పరులపైన బరువు లేని,
సిరులపైన తగవు లేని
కొరత లేని ....
నలత లేని ....
ఆనందమయావాసం!

హాయిగా ...
తీయగా ...
పాయసాలు మెసవగా;
భరోసాలు కురియుగా
వినోదాలు మొలవగా;
కిసానులూ మజూదూరులు
ఖులాసాలు పిల్చగా;
ఇన్సానుల జిందగీలు
ఆనందం డోలగా;
ఆజవంజవాలు సిరుల —
విలాసాల తేలగా;
డోలగా ...
తేలగా ...
ఎంతవరకు ప్రయాణం ?
చింతలేని ప్రపంచం !

కొండప్రక్క లోయలో

మలుపులో ప్రమాదాలు !
లోయప్రక్క మలుపులో
ప్రమాదాల కాపలాలు !
హొషియార్ ... హొషియార్,
దుష్మనోంకా ఇన్తజార్!
ఛెలో భాయి ...
ఛెలో భాయి
జరూర్ — జరూర్ ఛెలో భాయి !

రహస్యం ! — రహస్యం !!
మలుపులో ... సొలుపులో ...
ప్రమాదాల విమానాలు !
హొషియార్ ...
హొషియార్ ...
దుష్మనోంకా ఇన్తజార్
ఛెలో భాయి జరూర్ జరూర్ !

" ఎక్కడికి ప్రయాణం? "
" చిక్కులేని దాలోకం! "
" ఎందులకీ ప్రయాణం? "
" నందడిగల జీవనదం! "

ప్రయాణం ...
ప్రయాణం ...
ఆనందమయావాసం!

చక్రాని దా ప్రపంచం!
ఎంతవరకు ప్రయాణం?
ఎక్కడికి ప్రయాణం?
చింతలేని ప్రపంచం!

[టీక : సత్ : బాహ్యవాస్తవికత; చిత్ : చైతన్యం; ఆనందమ్ : ఆనందమయభవిష్యత్తు ; లోకాలోకం : సరిహద్దు; భరోసా: ఆత్మవిశ్వాసం; ఇన్సాన్:మానవుడు జిందగీ - బ్రతుకు; అజవంజవాలు - సంసారాలు; హోషియార్ - మెలకువ కలిగివుండు; దుష్మన్: శత్రువు ఇన్తజార్ : నిరీక్షణ; జరూర్ : అవస్యం.]



# కవిః క్రాంత దర్శి సర్వ దృక్

ప్రసవించు... ప్రభవించు...
ప్రసరించు... ప్రవహించు...
ప్రసవించు మా కాంతిమాలా!
ప్రసవించు మా శాంతిబాలా!

## 1

ఉదయాన్ని లేస్తాను,
హృదయాన్ని మూస్తాను,
వడివడిగక్షైఅడుగులిడి
ఫ్యాక్టరీ కెడతాను;

పొద్దు మునిగేదాక
సడ్డు మణిగేదాక,
చక్రాలు—హస్తాలు

కలిపి జీవిస్తాను.
హృదయాన్ని--ఉదయాన్ని
కలిపి పెనవేశాను....
హస్తాల్ని--చక్రాల్ని
త్రిప్పి నంధించాను....

ప్రసవించుమో కాంతి!
ప్రభవించుమో శాంతి!

## 2

తొలికోడి కూసింది,
తొలిచుక్క పొడిచింది,
తలగుడ్డ—చేకర్ర—
కలవెచట ? చలిదిముంత....

ఎద్దుల్ని తోలుకొని
నడిచాను; మడిచేను,
అరకన్ని పూన్చుకొని
దున్నాను—తొలి చేను;
దొరగారి మట్టిలో
మణులు మొలిపించాను...
దొరగారి పొట్టలో
మణులు నిలవుంచాను...

ప్రసరించుమో కాంతి!
ప్రవహించుమో శాంతి!

## 3

నెల మొదటి రోజుకై
విలువలను మరిగించి
నెలవంక కోసమై
నిలువెల్ల కరిగించి

సంసార సాగరా
లీదసేరని బ్రతుకు
అడుగడుగునా హంస
పాడుమొలిచిన బ్రతుకు

లొకటిగా పెకళించి
సకల లోకమునుంచి
విదళించి, వికసించి
స్వాగతము లంపిస్తాను . . .

ప్రభవించుమో కాంతి
ప్రసరించుమో శాంతి!

## 4

తాత తాతలనాటి
మాన్యాలు నమ్ముకొని,
దున్నుకొను కొండ్ర నా
శనము గావించుకొని,

గడ్డు బ్రతుకుల బండి

నడిపాను, గడిపాను;
ఒడిదుడుకు దారుల స
హించాను, మించాను;

బడి చదువు కొనసాగి
సర్వము ధారబోశాను.
పనిలేదు, తిన తిండి
లేమితో చరించాను.

ప్రసవించుమో కాంతి!
ప్రసరించుమో శాంతి!

5

ఇహలోక బాధలను
చూశాను, రోశాను;
విజ్ఞాన తపము—క
ర్మల నాచరించాను;

బోధినై, శిలువనై,
నెలవంకనై—ధరా
మండలికి శుభము
వికసించ ఆశించాను;

నవనరుడనై పుట్టి
పుడమికి డుములుబాపి
నవ ధర్మధ్వజము

జగమున ప్రతిష్టిస్తా !!

ప్రసవించుమో కాంతి !
ప్రభవించుమో శాంతి !



ప్రసవించు....ప్రభవించు....
ప్రసరించు....ప్రవహించు
ప్రసవించుమో క్రాంతిశక్తి !
ప్రభవించుమో శాంతిదేవి !!



# నాకోసం పూచిన
# నాకోసం వేచిన
# ఏదీ ఎర్రగులాబీ?

[౨]

అవును మనం నిర్భాగ్యులం
అవును మనం దరిద్రులం
అవును; లేదు— భవిష్యత్తు మనకి
నాచుట్టూ చీకటి
అవును; నీలోపలి
అంచులచుట్టూ పెంజీకటి.
వాకిలి గోడల ఆవరణం
చుట్టూ చీకటి మనకి.

అయ్యో అలా ఆకురాలుస్తోందేం గులాబీ?

అయ్యో అలా పూరేకులూడుస్తోందేం గులాబీ?
అయ్యో అలా ఎండిపుల్ల విరుస్తోందేం గులాబీ?

అవును మనం దరిద్రులం,
అవును మనం అభాగ్యులం...

[8]

ఉందా ఎప్పుడైనా భవిష్యత్తు మనకి?
ఉందా ఎప్పుడైనా భాగ్యరేఖ మనకి?
ఉందా ఎప్పుడైనా ఆనందాల వాన మనకి
ఉందా ఎప్పుడైనా వినోదాల పంటమనకి?

ఉంటే నీకు నాకు స్పష్టంగా కనిపించదెందుకు?

అవును—ముమ్మాటికి నిజం చెపుతున్నాను;
అవును—ప్రమాణపూర్తిగా చెబుతున్నాను;
ఉంది మనకి—పచ్చని భవిష్యత్తుంది!
పంచరంగుల భవిష్యత్తుంది !
ఆకాశంలో, చీకటిలో, మినుకు
మినుక్కుమనే ఒక్క నక్షత్రం
లాగుంది భవిష్యత్తు మనకి.

అవును మనమంతా
పచ్చచిలకల్లా, పాలపిట్టల్లా, ఋషిపక్షుల్లా
ఆశతో పైకెగురుతున్నాం.

ఎగరలేక తలక్రిందులా
వ్రేలాడి పడిపోతున్నాం ; పడిపోతున్నాం.
వడివడిగా కొట్టుకుపోతున్నాం!

మన కంఠాలు మహారణ్యంలో
గజిబిజిగా అల్లుకొంటున్నాయి
గిజిగాడి గూళ్ళు!
కంగాళిగా కట్టుకుంటున్నాయి
తుమ్మకొమ్మల తుప్పల్లో ఇళ్ళు!

అవును నేనూ అవతరిస్తాను
తుపాతునకలైన శరీరంగా !
అవును నేనూ అవతరిస్తాను
కుళ్ళిన మాంసంగా చచ్చిన శవం
గా; అవును నేనూ అవతరిస్తాను—
కుళ్ళి కంపుకొడుతున్న శవంగా;
రాబందులు పీకుతున్న కళేబరంగా,
భ్రష్టునిగా భూభారంగా....

[౫]

అతనేమిటి అంటాడు?
అదిగో—అతనేదో అంటున్నాడు :
ఇది మరుస్థలం
ఇది స్మశానం
ఊసర క్షేత్రంబిది—

రాతిదేముళ్ళు కాపురంచేస్తున్నారిచ్చోట;
బ్రహ్మ చెముడు డొంకల మట్టల్తో
పుట్టల్లో కాపురం చేస్తున్నారిచ్చోట!
జనాభా లెక్కల్లో పేరులేనివాళ్ల చేతులు
జోడింపైదండాలు పెడతాయి వాళ్లకి....
భూతప్రేతాది పైశాచిక గణాలు కీర్తించి
వందిమాగధస్తోత్రాలు వినిపిస్తాయి వాళ్లకి...
అదిగో అతనేమిటో ఇంకా చెబుతున్నాడు,
నిబ్బరంగా నిటారుగా నిలచి
నిజాయితీగా గుండెల్ని
చేతుల్తో విప్పి చూపిస్తున్నాడుః

అవును నరకంలోకూడా అచ్చంగా
ఇంతే ఇంతే ఇలాగే ఉంటుంది.
అక్కడవాళ్ళూ—ఇక్కడవాళ్లమూ కూడా
ఒక్కలాగే—దేవతల్నీ, రారా
జుల్నీ, ఫాజుల్నీ, అధినాయకుల్నీ,
కులీనుల్ని, తమకన్నా గొప్పవాళ్లనీ,
ప్రార్థిస్తూ . . . యాచిస్తూ. . .
'నీ బాన్చని దొరా—నీ కాల్మొక్కుతా!'
నంటూ, ప్రభువుల పాదాల కొనవేళ్ల
గోళ్లసువర్ణచ్ఛాయల్ని కంటూ...
ఇలాగే—ఒక్కలాగే!...
కాబట్టి మనమందరం...

ఇంకా ఇంకా చెప్పుకుపోతున్నావేమిటి?
ఎందుకయ్యా! లేని పోని
బెడదల్ని తెచ్చిపెట్టే ప్రయత్నం?
కష్టాల్ని కట్టబెట్టే సన్నాహం?
ఈ పులుసుతో ఈ ముద్దదిగక
నానావస్థలూ పడుతూంటే,
ఎందుకుబాబూ! మరింకా మమ్మల్ని. . .
ఏం లాభముందయ్యా! ఎవరు వింటారని: . .
పోనిద్దు నాయనా గొడవెందుకు?
కళ్లు మూసుకుంటే గడిచిపోతుంది దినం!
వద్దు తండ్రీ! సుతరామూ వద్దురభవ!

[వ]

బాబోయ్!
బాబోయ్!!

*

అదేమిటీ? అదేమిటీ?
ఇంతవరకూ పగిలి చిట్లి
వ్రేలాడిపోయిన దవుడలు
తిరిగి మాటాడుతున్నాయేమిటి?
ఈ కుళ్ళిపోయిన మాంసంముద్ద
కూడుకొని కళ్లు విప్పుతోందేం?
తుపాకీలు పెళ్లిచేసుకుని, పల్లకీలెక్కి
వినోదం కోసం —అబాలగోపాలాన్ని

ఆలీ పిల్లల్ని పోగేసి, నాజూకుగా
బట్టలొలిచి, దిసిమొలలతో జనాన్ని
వేడుగ్గా ఊరేగించి;ప్రతిశిలావిగ్రహం
దగ్గరా ముక్తాయించి నప్పుడు...
కుప్పలుగా కూలిపోయారుకదా,
నీరవంగా నీళ్లుకారి పోయారుకదా,
అయ్యో!ఇంతట్లోకే---
అలుగులతో చిగురించారేమిటి?
లావాలాగ ప్రవహిస్తున్నారు దేనికి?

అయ్యో,అయ్యో మేం
స్వగతాలు మరిచిపోయేమే?
అమ్మయ్యో,అమ్మయ్యో,మన
అందరి పిడికిళ్లూ బిగించుకు పోతున్నాయేం?

ఆహా సంగతి? అహా అసలు విషయం?
అవు నవును అదే, అదిగో ఇంక
మృత్యురాజ్యానికి సమాధి కడుతున్నారా?
అవును నిర్భాగ్యుల ఆశయం--
ఇదేనా! ఇదేనా దరిద్రుల ఆశ!!...ఇ...

[౫]

ఇదేమిటే నువ్వు పరి
గెడుతున్నావు? అ

దేమిటి అతను పరి
గెడుతున్నాడు? ఇ
దేమిటి అందరూ పరు
గు పరుగున పోతున్నారు!
అమ్మయ్యో—నేనుకూడా
పరిగెడుతున్నానా?
అయ్యో, య్యో! మనమందరం
పరిగెడుతున్నా మెక్కడికి?

*     *     *     *

అప్పుడే—
వేగుచుక్క పొడిచిందేమిటి?
—అపుడే
తొలికోడి కూడాకూసిందే మిటి?
పచ్చగా తూరుపు తెల్లవారిందేమిటి?
ఎర్రగా లోకం అలంకరించుకుందేమిటి?
అప్పుడే—
ప్రత్యూషపునా జీవంతొణికిస
లాడుతూ ప్రత్యక్షమైందేమిటి?
—అప్పుడే....

[ద]

మాయల్ని కడిగేశావా?
భయాన్ని చెరిపేశావా?
దెయ్యాన్ని తరిమేశావా?

నిలుస్తుంది సత్యం
వెలుస్తుంది జీవం!
మొలుస్తుంది స్వర్గం!
ఇక మనదేనోయ్ రాజ్యం,

గాడిదల్ని తోలేశావా?
బూడిదల్ని ఊదేశావా?
బాడుదల్ని దులిపేశావా?
ఫలిస్తుంది పొలం!
పెరుస్తుంది అనలం!
మలుస్తుంది కలం:
ఇక మనదేనోయ్ రాజ్యం

చింతల్ని నరికేశావా?
నలతల్ని విడిచేశావా?
కలతల్ని తుడిచేశావా?
జనిస్తుంది సౌఖ్యం
జ్వలిస్తుంది దేహం!
విరుస్తుంది పుష్పం!
ఇక మనదేనోయ్ రాజ్యం

[౨]

నా గులాబీ మొక్క:
తొడిగింది రెమ్మల్ని;
ముడిచింది మొగ్గల్ని;

విడిచింది పూవుల్ని:
నా గులాబీ చెట్టు!
ఈసారి....

ఏ మింద్రజాలం, ఇదే మింద్రజాలం నిశీథా
ల్ని షేఘాల ఊసల్ని కోసుకొని త్రోసుకొని....

ఏమింద్రజాలం ఇదే మింద్రజాలం మహా
యింద్రజాలమ్ము—చీకట్లవాకిళ్ల ఆకల్ల—భా
వాల కవాటాల్ని త్రెంచుకొని కూల్చుకొని....

వెలుతుర్ని వెలుగుల్ని పలుపుల్ని ఫలముల్ని
చూశాము దూకాము కన్నాము ఆకట్టుకొన్నాము!

నా గులాబీ చెట్టు!
ఈసారి ఏం పచ్చ
గావుంది ఏమెర్ర
గావుంది ఈసారి....

నా గులాబీ చెట్టు!
(క్రింద నల్లరేగడిమన్ను రేగుచుండు)

మన గులాబీ చెట్టు!!
(పైన నీలిమాకాశమ్ము ప్రతిఫలించు)

అవును నీదేనోయి—
ఈ జీవితమ్ము, ఈ జీవితమ్ము!
అవును నీదేనోయి—ఈ....
ఈ భూతలమ్ము, ఈ భూతలమ్ము!
అవును నీదేనోయి—ఈ....

అవునింక—మనదేను, మనదేను, మనదే
ఈవిశాల ప్రజారాజ్యం!

ఇది పాతయుగమునకు స్వస్తి!
ఇది కొత్తయుగమునకు స్వస్తి!

ఇది కొత్తజగమునకు సృష్టి!
ఇది కొత్తజగమునకు సృష్టి!

మాటలతో కాదులే—
ముష్టియుద్ధం తోటి.

తమసోమా జ్యోతిర్గమయ
అసతోమా సద్గమయ
మృత్యోర్మాఽమృతంగమయ
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# సూత్రధారుడు

ప్రాపంచికంలో మహానాటకం నిత్యముగా సాగుతోందే ప్రజానీక మేకంగ బాగానె చైతన్యవంతంబుగా సాగుతోం దే?

ఇదేం ఖర్మమోగాని లోకాన రెండేసి పక్షాలు తీవ్రాతి తీవ్రంగ పోరాడుతున్నాయికాదా?

కృశిస్తూ నశిస్తూన్న పక్షం జనానీక నిర్జీవనా భారమందున్ చరిస్తోందిగాదే పశిస్తోందికాదే ఫలంలేని మార్గాన హీనాతిహీ నంగ దీర్ఘప్రయాణం వహిస్తోందికాదా ?

ఫలంతేని శౌర్యాలి కార్యాలు చంత ప్రపంచంబంగ క్రూరాతి క్రూరంగ నీచాతి నీచంగ ఘోరాతి ఘోరంగ శక్తుల్ నియో గించి కేంద్రీకరిస్తూ ప్రయత్నాలు చేస్తోందికాదా?

ప్రమాదాల పర్వం రచిస్తోందికాదా ?

విరోధాల సారం లిఖిస్తోందిగాదా?లడాయాల కాండం వచి స్తోందికాదా? విచారాల గీతం పఠిస్తోందికాదా?

అదే చీకటీ వెల్తురూ ప్రాంగణంలో బలంతోడ ఒండొంటితో పోరు సాగించ కక్షల్గా ప్రకోపించ బీభత్స రూపాన సంఘ ర్షణాధిక్యతల్ రేగుచుండెగదా!

దిక్కులన్నీ సమూలంగ కూలంకషంగా భయంతో చలిం
చె విషాదాన ఘోషించి గర్జించలేదా?

నిజంగానె విశ్వం సమస్తం ప్రకంపించలేదా? ప్రజానీక
మంతా భయోద్రేకముల్ చెందలేదా? నిజంగానె వాతూల
మీలోకముఁ ముంచలేదా? దవాగ్నిచ్ఛటల్ క్రమ్మలేదా?

ఇదే నేటి రంగస్థలంలో ప్రదర్శించబోయే మహానాటకం!

చూడబోతూ పదిఁ ప్రశ్నసేయంగనేలా? మహాభాగులారా
నమస్కారమండీ! నమస్కారమండీ మహాభాగులారా
నమస్కా....

## ప్రభుత

నందికేశుడోయ్ మా కులదేవుడు
అశ్శరభశరభా అల్లల్లఖీరా!

జటాజూటములు కపాలమాలలు
తంధానా తంధాన తంధనా

ఖలడపరశుకర – ఖండి వాలములు
అశ్శరభ శరభా అల్లల్లఖీరా!

కఠోరబాహువు కుఠారధారలు
తంధానా_తంధాన_తంధనా!

గదాదండ కరవాల శూలములు
అశ్వరభ శరభా అల్లల్లభీరా!

నందికేశుడోయ్ మా కులదేవుడు
అశ్వరభ శరభా అల్లల్లభీరా !

## విరాగం

శివశివా యనవే తుమ్మెదా !
శివుడనగ వినమేలు తుమ్మెదా !
శివుని భక్తులాకు తుమ్మెదా !
శివశరణనా మేలు తుమ్మెదా !
శివశివా॥

ముట్టీముట్టని పూవు తుమ్మెదా !
ముట్టింది జగమెల్ల తుమ్మెదా !
ముట్టి చూడలేవె తుమ్మెదా !
అది
ముట్టి పాయలేవె తుమ్మెదా !
శివశివా॥

బహుపుష్పావాసనే తుమ్మెదా !
ఆహ్వాన మందావె తుమ్మెదా !
కొవ్వి నీ వెరుగవే తుమ్మెదా !
నీకు
నెవ్వి నేరము లేదు తుమ్మెదా !
శివశివా॥

అరురేకుల పూవు తుమ్మెదా
అది మీరినా వాసనే తుమ్మెదా
వేదుసేయగ నీవు తుమ్మెదా
శివు
జేరి భజియించవే తుమ్మెదా
॥శివశివ॥

# వేదాంతం

ఏం లాభముంది జీవా,
ఏం చేయగలం మనం?

స్వధర్మే నిధనం శ్రేయ
పరధర్మో భయావహః!
పరమాత్మ సంకల్పం వినా,
కదలదు గడ్డిపోచయినా!

నడిపించేదేదో అది లేకపోతే,
నువ్వూ నేనూ కూడా కదల్లేమంతే!
అద్యంత రహితమైనదీ,
నిర్వికల్పానంద సంయుక్తమైనదీ;
అదొక్కటే పరబ్రహ్మ స్వరూపం.

కాబట్టే పూజించి— కీర్తించి:
సంసార సాగరంనుంచి,
సంకుల సమరంనుంచి
కల్లోల ప్రపంచంనుంచి,
తరించి,
సుస్థిరమైన మోక్షలక్ష్మిని చేపట్టాలంటే:
' త్వమేవా శరణం మమ!'
అంటూ బ్రతకాలితప్పితే
మార్గం లేదు నేస్తం!

ఇతి సర్వజ్ఞానసారం సమస్తం.

సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వ పాపేభ్యో
మోక్షయిష్యామి మా శుభమ్
ఇతి కీలకమ్!
ఇతి పరమాత్మోవాచ

ఆధిభౌతిక ప్రపంచం సర్వం
నశించిపోతుంది నిజం!
యద్దృశ్యం తన్నశ్యం
జాతస్య మరణం ధ్రువం—
ఇతి ధ్రువం— ఇతి ధ్రువమ్!!

## మిథ్య

కాంతాల పాతెమలోన
చింతపూహూ పుట్టెగదరా
చింత ఆనలు కొనలు సాగంగా
ఏగంటిలింగా
చింత పూసి పండు పండేరా!

ఆకసాన కోడి కూసె
చీకటంతా పొద్దు పొడిచె
మూక చిత్తామధ్య మందూ
ఏగంటి లింగా
ఏకమై వెన్నెల కాసెరా!

కానరాని అడవిలోనా
వానలేనీ మడుగు నిండె
వానలేని మడుగు మీదాను
ఏగంటి లింగా
మానరాని అగ్ని పొడమేరా!

ఆకులేని యడవిలోనా
తోకలేని మృగము పుట్టె
తోకలేని మృగము కడుపూనా
ఏగంటి లింగా
ఈకలేని పక్షిపుట్టెరా

# వైదికం

ధన్యోహమ్ ధన్యోహమ్ దుఃఖసాంసారిక నవీక్షేద్య
ధన్యోహం ధన్యోహం కర్తవ్యం మేనవిద్యతే కించిత్!
ధన్యోహం ధన్యోహం తృప్తే మేఞ కోపమా భవేల్లోకే
ధన్యోహం ధన్యోహం ధన్యోధన్యః పునఃపునర్ధన్యః

అహోపుణ్యా మహోపుణ్యం ఫలితం ఫలితం ధృఢం
అన్యపుణ్యాన్య నంపత్తే రహోవయ మహోవయం!
అహోశాస్త్ర మహోశాస్త్ర మహోగురు రహోగురుః
అహోజ్ఞాన మహోజ్ఞాన మహోసుఖ మహోసుఖం
[వేదాంతపంచదశి]

# భీతి

వచ్చుచున్న దల్లదిగో! ఆక్రమింప పిశాచం
పిశాచం!
విచ్చుకున్న తిమిరంవలె కట్లుతెగిన విరోధం,
విరోధం!

అట్టహాస కహకహారావంతో విఘాతం
విఘాతం!
ముట్టడించ జీవితాన్ని జీమూతం—వికారం,
వికారం!

## కవిత

మానవులార!
రోగములు మానును,
లేములు లేవు,
సంపదల్ జానగు;
జారు నఘంబులు
మందబుద్ధులై
దీనత నొంద నేటికి?
అతిస్థిరమైన విలోక లోక
సంధానము వజ్రశక్తి
జనతాహృదిలో
ప్రభవించి మించుతకా!

## పౌరుషం

బాధలే—
గాధలై:
భూమిలో
స్వామికే

కాసుకే
దాసుడై

జీవముగా
భావముగా
వానికే
కానుకై

పుత్రుడో
పుత్రికో
వానికే
దానికై

బాడుగల్
పాడుముల్
భీతితో
రోతతై

రోషసల్
పోషసల్
వారితో
ఏరుతై!

సంకటం
కంటకం

# సుకాంతి

వికారముల్
శపించెదన్
విలాపముల్
త్యజించెదన్
వినోదముల్
వరించెదన్
విలాసముల్
విరించెదన్
భవిష్యమున్
సృజించెదన్

# నటి

ఈ లో
కం లో
పోరా
టం రే
గెన్
పా౧
చీన
మిత్ర వి
శ్వంలో
నవ వి

# వ్యాపారం

[ ఇంతింతై వటుడింతయై
మఱియు తా నంభోవీధి ... ]

లాభం – బేరం
బేరం – సారం

వస్తే యుద్ధం
వ్యాపారానికి
లాభం – లాభం
సారం - బేరం!

కరువులు వస్తే
కాటకమొస్తే
లాభంసాటిది
బేరం - సారం

ధాన్యం బియ్యం
పప్పూ ఉప్పూ
అన్నిటికీ కరు
వొస్తే చూడు!
కంట్రోళ్లుంటే

మనకే కీడు
చీకటి అంగటి
లోనే కాదు!

లాభం - సారం
బేరం - లాభం.

చీమల పుట్టల్లాగ ప్రజలు
పెరిగిపోతున్నారు ఇలలు!
దేశంలో పండుతున్న పంటలు
గాని దేశంలో రాత్రింబవళ్లు
తయారవుతున్న సరుకులు
గానీ, సరిపోవటం లేదంటే-
దాని వెనుకనున్న కారణం ఏమంటే
చచ్చుజనం దినం దినం
లక్షలాదిగా పెరుగుతుండటం
ఈ విషమ పరిస్థితి కంతకీ మూలం ;
ఇది పరిష్కరింపబడే మార్గం
ఉన్నది; అదొక్కటే ఒక్కటి.
తప్పనిసరిగా జనాభాను తగ్గించే
ఏర్పాటుచేయాలి; తప్పదు.
భూభారంతగ్గించి వేయాలి;
అందుకే యుద్ధం వచ్చితీరాలి!

కార్మికులు రోజురోజుకీ అరాచక చర్యలకు దిగజారటం

జాగరూకతతో పరిశీలిస్తోంది మన ప్రభుత్వం;
నేటి స్థితిగతుల్ని బట్టి హక్కులంటూ ఆరాటపడే
పోరాటం సాగించేవాళ్లంతా దేశద్రోహులు నిజం!
దేశంయావత్తు తీవ్రమైన అపాయంలో
చిక్కుకున్నప్పుడు ప్రతిపౌరుని హృదయంలో
నా—నేర్పువహించే విధేయత పెరగడం,
బాహ్యతల్ని దృష్టిలో ఉంచుకుని పరిశ్రమించడం,
ఉభయపక్షాల క్షేమానికి నిరపాయతకీ లక్షణం!
నేడు మనప్రభుత్వం కట్టెదుట ఉన్నవి రెండే
రెండు సమస్యలు ఉత్పత్తి చేస్తామో – సుభిక్షంగా
జీవిస్తాం మొదటిది లోపిస్తే రెండోదికూడా
హుళక్కి ఇంటా బైటా శత్రువులు చెదపురుగుల్లా
వ్యాపిస్తున్న రోజుల్లో ఉప్పెనలా ఆత్మవినాశనంలా
విరుచుకు పడుతున్న రోజుల్లో దేశభక్తులైన
ప్రజలందరికీ ఏకంకావాల్సిన పాఠం పరిస్థితులే
నేర్పుతున్నాయి సత్యం కాబట్టి మనం మన
సాంఘిక జీవితంలో గమనించాల్సిన
ముఖ్యాంశా లేమంటే:
ఒకటి ఉత్పత్తి ఉత్పత్తి;
రెండు ఆహారపదార్థాల నిష్పత్తి నిష్పత్తి;
పారిశ్రామికకేంద్రాల్లోని కార్మికజనం
సమ్మెలూ వగైరా దౌర్జన్యాలు మానడం!
ఒకవేళ జరిగినవా నిస్సందేహం
గా అణచివేస్తుంది మనప్రభుత్వం!

కార్మికజనాలు అరాజికవాదులచేతుల పడడం;
వాళ్లమోసాల గాలాలకి తగులోక్కొ వడం;
తద్వారా దుంపగిడు చర్యలకు పూనుకోవడం;
మువమ్మాటికీ నిజం— సహించదు మనప్రభుత్వం!
అన్నిటికన్నా ముఖ్యమైన విషయం—
కార్మికులంతా జాతీయసంఘాల్లోనే చేరడం;
అన్నిటికన్నా మరోటీ ముఖ్యం—
మనస్వాతం........

## నిశ

తామసిని నేను
నేననంత మృత్యు
భీకరదంష్ట్రాగ్ని
కీలికను, జ్వాలికను
నితాంత హేమంత
శర్వరిని నేను;
శీతల కర్కశ
నిశామూర్తి నేను;

"నా కఠిన పాద
శిలల క్రిందపడి
నలిగిపోయినవి
ఎన్నెన్నో మల్లెపూలు మున్ను;"
'నా హృదయ వాంఛితార్థము

మృత్యు శైథిల్య మొకటి!'

ఏను తమస్వినిని;
తత్వమసిన్నేను.

## కవాతు

కఠారముల పొడిచెదఁ పొడిచెదఁ పొడిచెదఁ!
కుఠారముల నరికెదఁ నరికెదఁ నరికెదఁ
కఠోరముగ బ్రతికెదన్ బ్రతికెదన్ బ్రతికెదఁ
పటాలమును నడిపెదన్ నడిపెదన్ నడిపెదన్

## వనిత

అయయో
అయయో
కొనిపో
యిరిరో
కొడుకో
కొడుకో
తినడా
నికి తిం
డిని కో
రెనురో
బ్రతికేం

డుకు హా
క్కును కో
రెనురో
బ్రతికేం
దుకు భ
త్యము కో
రెనురో
కొడుకో
కొడుకో
అయయో
అయయో
కొనిపో
యిరిరో
అతడే
అతడే
అని చూ
పిరిరో
కొడుకో
కొడుకో
అయయో
అయయో

## నిరాశ

“ ఇపుడు ప్రళయమ్ము క్రమ్మినదేమొ కాక

దొరకదో నిల్వనీడ నా చిరుతపాటకు
ఇంత యిరుకౌనె యిమ్మహానంత విశ్వ
మలమికొను చీకటుల కలకలమువలన.

ఎటుగనినగాని అకాశహృదయవాటి
సంకుల విషాద జలధరచ్ఛాయలందు
పొంచు బాష్పాంబునిధులు ఘోషించు; నెగుర
పక్షముల దాల్పవెరచు నాపాట నేడు.

ఇది నిశాంత తమఃక్రాంత మిది దరిద్ర
మీ నిశాంతమ్ము శూన్య మిందెన్నడో రహ
శ్శిథిల సుప్తి కలవరమంది లేచి
గుబులుకొను లేత నెత్తావి గుసగుసలెవొ!"

## పౌరుషం

మన తాతల పొలములివే ఖిలీభవించెరా;
మనపూర్వుల కొలనులివే ఘనీభవించెరా;
కులస్వాము లాశలివే ఖిన్నతపొందెరా;
హలపాణుల ఖేటములివె జలమయమాయెరా;

## జనత

ఇంతవర కోర్మిగల జంతువులుగా బ్రతుక

బడలిన శరీరములు బడుగు పసువ్రా బలెను
గడిచిన దినాలకత - ఒడలిన సుమంబై -
తొడిమవిడి రాలినది తొడరిన విపత్తువలె;
కదలికదగా గలుగు పుడమి సిరి మాడ్కిఁ!

కలుషమగు నిద్దరను కలిమిగల వారలకు
తులువలకు బానిసగ మెలగిన యొడందల్
అలసి కలగుండువడికలగి విలపించినవి
సొలసినవి యాకలికి చెలగు ధృతితోడఁ!

స్థిరముగ భరించిన తిమిరము విదళించి మన
జరతొలగగా నిరతి నిరసనల కూర్చఁ
కరముల పెనంగి పలుశపురల కలంచి ఘన
తర రుజకు నేడె పరిహరణము లభించన్!

## కవిత

"పులిసిలనేల?
మానవుల పుట్టువు పావనమయ్యో!
ఎప్పుడున్ కళవళమేల?
రోగముల్ కాలగతింగడవట్టు-

ఈతి బాధలును,
దరిద్రతా వ్యథలు,

దవ్వులకే పను,
వాంఛితార్థముల్ కలుగ —"
సమైక్యశక్తిగల
క్రాంతిపరంచి పురోగమించగాన్!

## ప్రభుత:

నాశనమ్ము చేయ బూని నాగరీకలోకమున్
శ్వాసనిల్పి పొతరిలిన శ్వానమాన మానవుల్
శాసనాల త్రుంచి ప్రజలశాంతి భద్రతలకు సం
త్రాస ముప్పతిల్ల కలవరమ్ము కలుగజేసిరే!

సాహసికకార్యములతొ సాంప్రదాయసిద్ధముల్
బూహళించి కీడుమూడ బుద్ధిమందగింపగా
ద్రోహమనుసరించినారు ధూర్త జనుల బలముతో
వ్యూహములనుపన్ని ఖేదమొసగ ధూమకేతువుల్!

కానసేడె శత్రువులను గాసి కలుగజేయగా
మానవోత్తములును ధీరమతులమంతఏకమై!
భూనభోంతరాల నిండు పుట్టిపులక నద్దగా
త్రాణ చూపి కూడమట్టి ధరణికీర్తినిల్పుడో!

కట్టకొట్టి మట్టుబెట్టి ఖైదునపడవేయగా
చుట్టములతొ పొందుచీల్చి సుఖముల విడతీయగా
చట్టములను సంస్కరించి సాయుధబలసంపదల్
దిట్టమైన కంచుకోట తీర్చి సిద్ధగావలెన్!

## మేధ:

చేతల్ని కూర్చి
రోతల్ని కూల్చి
వ్రాతల్ని చేర్చి
ప్రేతల్ని మార్చి

ఆశల్ని పేర్చి
మూసల్ని పేల్చి
భేధాల్ని చీల్చి
ఖేదాల్ని పూడ్చి

రోగాల్ని కాల్చి
రాగాల్ని తూల్చి
వేదాల్ని దొల్చి
మోదాల్ని తేల్చి

## వివేకం:

ఇరులను ద్వేషిస్తాం
సిరులను విభజిస్తాం

కురులను విడదీస్తాం
విరులను ముడివేస్తాం

కరువును ఖండిస్తాం
బరువును పండిస్తాం

జర పరిమారుస్తాం
పరువును కాపస్తాం

భ్రమలను ఛేదిస్తాం
అమరత సాధిస్తాం

## ధైర్యం:

నాకలలను ఇటుకలుంచి
నవభవనం నిర్మిస్తా!
నానరకం గుద్దళించి
నవనాకం పెకళిస్తా!

నాఆశల బొందడేసి
కొత్తకోట సృష్టిస్తా
నారక్తం సిరా పోసి
కొత్తపాట విరచిస్తా!

## విజ్ఞానం:

ఆధిగాని వ్యాధిగాని కాదులే రాదులే
సొదలుగాని చెరలుగాని కావులే - లేవులే

చేతగానితనంగాని కాదులే – లేదులే
రోతగాని చేదుగాని లేదులే - కాదులే

కలహంతో ప్రోజనం లేదులే – లేదులే!
అజ్ఞానపువికలాంగం లేదులే–లేదులే!
లోహఖచితదేహులచటలేరులే - లేదులే
లోహితమయవాహినిచటలేదులే – లేదులే

ఆదిగాని వ్యాధిగాని లేదులే - లేదులే
సొదలుగాని చెరలుగాని లేవులే – లేవులే!

పరిభుత

అనాదిసిద్ధమైన సంపదలను మార్చి కీడుచేర్చ
వినాశనమ్ము సేయ బూని ఘోరహింస పాలొనర్చ
విలాస..ంపదలనుకూర్చి దుఃఖముల సృజించి మించ
ప్రలోభమతులు - జ్ఞానహీనులందరొక్కటై చరించ

నిశ్చయమ్ముతోడ నేడు నీచ మానవాళి చేర్చినారుగా
కక్షకట్టి పట్టపగలు నిలువుదోపిడీలొనర్చినారుగా
పోరుతెచ్చిపెట్టినారు, పొందు చీల్చివేసినారు. నోటిలో
కూరుకున్న కూటిలోన మట్టికొట్టినారు విడువచేటగున్

కత్తులనెత్తుడు కుత్తుకనరుకగ పందలు - పందులణంగన్!
సత్తువచూపుడు మత్తువదల్చుడు నెత్తుటితోనిలనిండన్!
మనలో మనలకు వాదనలేలా? మక్కువతో బ్రతుకంగన్?
జనములతో తెగబలిసిన పొగరును ఛేదించాలికవేగన్!

కావ్యసవడిసడిగా నడువండీ - కదమును త్రొక్కుచు
కదనముకై
చేవగలారిని చేప్పుడు చకచక నాగరికత కాపాడుటకై
సాహసమొక్కటిగల్గినచాలును, కొరతేమున్నదిధారుణిలో?
వాహనములె - సరిపోవును - సాయుధబలసంపదలీ
సమరంలో!

పట్టుము కొట్టుడు తుదముట్టించుడు శత్రువునిశ్శేషముగా
చెట్టునకొక్కరుగా విపతీయుడు గట్టిగకట్టుడు . చావంగా
భేదముచూపక విప్లవకారుల – దుండగులందరి నణచన్-
ఖేదముచూచియువారత చూపిన ఆత్మవినాశమె లాభించున్

## పరిసరాలు

ఈ పా పా లను
కా పా డా లని
రాకాసుల్ బలి
చేశా రం డీ!

మాయా మర్మం
ఎరుగని నరులకు
రా కా సుల్ వల
వే శా రం డీ!

బా
ధిం

ఈ పరి పాలన
పా పా లనగా....
ఈ పర పీడన
పా పా లనగా...
ఏం
జరి
గిం
దో
తెలు
సుకొ
నం
డీ:
అధికారం
సా
యుధ హస్తం
మా
రణహోమం
సా
గించిన దం
డీ!
ధన వర్గం
సా
ధన మృగ్యం

జం
ధనా లక్ష్యం
సా
గించిన పం
డీ!

# జనత:

మొదటివాడు
మనపొలం ఖరాబుచేసి బలిసిన బాఖురాకం!
రెండోవాడు
మన శీలమజా ఖరీదుచేసి పొట్టపెంచె ఖురాకం!
మూడోవాడు
మన విద్యల వృథాచేసి సంతసించె ఖురాకం!
నాలుగోవాడు
మన కండల నమిలి పెరిగి కొవ్వుపట్టె ఖురాకం!
అందరూ:
మన జనం ఖులాసకోసమేయురా ఖురాలకం!!
ఐదోవాడు
మన గృహాన చిచ్చుపెట్టి దాటినదా పిశాచం!
అందరూ:
మన జనాల తృప్తికోసమేయురా శిలీముఖం!!

ఆరోవాడు
మన కడుపుల పూడ్చివేసి పెరిగినదా పిశాచం!
అందరూ:
ము
ఖాముఖీ తేల్చరా
ఖామందుల పట్టరా
ఖాముఖా చీల్చరా
ఖాతకా లేవరే!

## ప్రాచ్యం:

భూపతితో వియోగ మిక
సైపలేవు రైతా

నీకన్నుల నూరలి ఉద్గమించిన
నులివెచ్చని కన్నీటి ధార
నా కాయము కాల్చుచుండె
పసి బిడ్డవు రైతా!

కరుణామృత తుషారాన
ఆర్ద్రమైన నీ యెడంద
ఖేదాగ్ని జ్వలిత మవగ
భువనాలే మసివారును,

కసియాడుమ, పసివాడును;
అలసి సొలసి మూగపడును రైతా!

బాధల నుతికించి జీవి
తమ్ము నతుకలేవు లెమ్ము
భూపతితో వియోగమున
గడుప లేవులే రైతా

## దక్షిణం:

నీరవమై జగతీగళ మెండి
కళవళంబు నొందెః
రోదసీ విశాల హృదయ
కుహరంలో పెనుతుఫాను.

ఆశాలవలేశా జనితాం
తరంగమయ్యె ధరణి!

నీవియోగ వార్ధికి పారా
వారము చనుదెంచె సఖా!
ఈవిషాద వారాశికి
తీరం చెంతాయె సఖా!

ఈయుగాంత నిశాంత

జనిత ప్రభాత నితాంత
కిరణోత్సవమై...
పొంగెను పృథ్వీలలామ;

వీచింపవె వాతూలం!
లేచింపదె పెనుప్రళయం!

నీవియోగమిక చెల్లను
నీ శాపంవిముక్త మౌ
శుభసమయము సమీపించె,
భయంలేదు లెమ్ము సఖా!

రేపటి కళ్యాణ కింకిణీ
సుస్వర మల్లదిగో వినుము సఖా
ఆగత కాలపు తురాయి
పూవులివె ధరించు సఖా!!

## పశ్చిమం:

ప్రయత్నించు, ప్రయత్నించు
ప్రయత్నించు, మానవుడా!
ప్రయత్నాలు—
ఫలితాలకు తల్లులు!!

చెలిమి, బలిమి, కలిమి, మనకు ప్రసాదించగా....
కలువ, చెలువ, విలువ మనల వరించాలిగా....
చదువు, పదము, ముదము మనకు లభించాలిగా....
శాంతి, దాంతి, కాంతి మనకు ఫలించాలిగా....

విరోధించు, విరోధించు
విరోధించు మానవుడా!
విరోధాలు—
వినోదాల తల్లులు!!

ద్వేషమీర్ష్య లేనిచోటు నందన వనమందగా....
కొత్తమూనలో సమాజ మందములను పెంచగా....
ఆశ వెలుగులో మనస్సు కొన్నినలను మించగా....
చందనతరు పరిమళాల నందనము ధరించగా....

ప్రయత్నించు, ప్రయత్నించు
ప్రయత్నించు మానవుడా!
ప్రయత్నాలు—
ఫలితాలకు తల్లులు!!

## ఉత్తరం:

ఉన్నదిలే దిట్టమైన పునాది
కన్నదిలే కష్టమైన అనాది

విన్నదితే భావికాల కాహళి
పన్నగాలు జీవితాన పోహళి

నన్ననిదీ కాంతి చూడు కాగడా
నన్ననిదీ గొంతు చూడు బేగడా

చిన్నది ఈ పాట చూడు కమాచి
చిన్నది ఈ కోట చూడు ప్రమాది

ఉన్నదిలే ఒకే ఒక్క ఉగాది
ఉన్నదితే మహా కాంతి సగాధి

ఉన్నదితే దిట్టమైన పునాది
ఉన్నదితే మొట్ట మొదట యుగాది

## నేపథ్యంలో:

కొత్తది
మెత్తది
లోక
మ్మొక్కటి;
పాతది
రోతవి
లోక

మ్మొక్కటి.

పోరాటం
లో ఆరా
టంలో ఆ
ర్భాటంతో
భూమ్యాకా
శాల్ దిక్కుల్
సర్వం నిం
డె
కంపించె!!

ఇది ప్రస్తుతం.

# తేజః

గుండెల్లో జాజ్వల్యమానంగా వెలుగుతూ మెదులుతున్న
పురాణపురుష పవిత్రస్మృతుల సోమరసంతో బలంతో
అచంచలంగా పోరాడిన మనవీరులు సమాధి జొచ్చిననాటి
నుంచి

స్పర్ధమాన కావ్యాలను సమిధలుగా ఆశయాల హోమగుం
డంలో వ్రేల్చి ఋత్విక్కులు ప్రకాశింపగల్గిన పవిత్రకళను
మనం ప్రారంభించిన నాటినుంచి

ఎడారిలోని ఎండలో నడుస్తున్న బాటసారి దూరాననగల చలి
వేంద్ర చల్లనినీడలు చూసి చేరివిశ్రమింపవలెనను కుతూ
హలంతో ఆశగా సారెసారెకు తన్మృతాను హెచ్చరించు
కుంటూ గబగబ అడుగులిడు మనస్థితిని మనం అభ్య
సించిన నాటినుంచి

బురదలో దిగబడిపోతున్న కాళ్లనూడలాగుకొంటూ ఊబిలో
చాటుగా దాగిన దొంగముల్లు పాదాలకు గ్రుచ్చినలిపి బాధి
స్తున్నా సహిస్తూ అతిచేరువగా కనిపించే అద్దరిగట్టును
చూస్తూ, ఆశిస్తూ దేహభారాన్ని ఈడ్చే పరిస్థితికి మనం అల
వాటు పడిన నాటినుంచి

పారంపర్యంగా మనలనుపీడిస్తున్న శాపాహతి కోపానల
జ్వాలల వాటునుంచి హాయిగ ఎత్తాలి పవిత్రసలిలాన్ని
పుణ్యజలాన్ని చల్లి దాని పునీతమించుకొను సన్నద్ధమై
ననాటినుంచి

ఆపః

స్వాగతమ్ము జనసైనికులారా
ఈజగానగల హీనతపోవున్
స్వాగతమ్ము మరశక్తికి నేడే
అజవంజవములార్తినశించుగా

భూమి సర్వము విభూతి భరించెన్
కామితాలు ధనకాంక్ష వరించెన్;
లేమితో బ్రతుకుక్లేశ తరంబై
తామసించ ఫలితంబు వినాశం!

పీడనాపహిత ప్రీతి విధానం
మానవత్వమును నిల్పుటకోసం
ఊడిగెల్లు క్రమపద్ధతి చెందెన్
దానవత్వమును దాపుటకోసం

స్వాగతమ్మిదిగొ శ్రామికులారా!
ఆగతమ్ము పరిపాలనచేయన్!
స్వాగతమ్ము జనవాంఛితనేతా,
రాగభవ్య కలధౌత నిశాంతా!

వాయుః

రారండో భూమికి కళ్యాణమిదే,
భారమ్ముల్ పోవుముహూర్తంబిదిగో!

ఈ రాజ్యం మానవ స్వామ్యంబుగదే,
స్వాధిపత్యంపిద్ది వికాసించుడహో!

లోకాలోకమ్ముల చీకాకులలో
ప్రాకారావృత్త జగద్వైఖ్యముతో
ఆకారం బాసిన రాకాసులతో
వ్యాకీర్ణం నుండక సస్యమ్ములతో

రండయ్యా లోకము పాలించుటకై
చూపండయ్యా హృదయంలో అనలం!
పాడండో జీవితగీతా లహరిన్
రండో రండో రణరంగమ్ముకున్.

## హృద్యాః

ముసురు పట్టి ముసాఱించి
వానకురిసి వరద ముసిరి
వెలిసినదిన మిదికదా!
వెలిగినదిన మిది కదా!

రోదసి కంపించి కుంచి
జలదాలను అంచగించి
జలతాపుల మెరపుమించి
వెలిగినదిన మిదికదా!
వెలిసిన దిన మిదికదా!

తొలకరి తొలికారు చారు
హార భూషణమ్ము కదా!
చెంగలువ చలువ పన్నీర
వింజామర మొసగూడె కదా!
శుభదిన మరుదెంచెనులే—
అభయము వికసించెనులే!

వెలుగు నిటారుగ లేచిన
వలపు మిటారులు సాచిన
చపల బాట మిసమిసలివె—
ఎదల తోట గుసగుసలివె—
ముదము పండు సమయమిదే!
నదులు పొంగు సమయమిదే!

కొత్తకాంతి తెచ్చె బలే!
కొత్తశాంతి తెచ్చెబలే!
నా నరాల దాపులలో
నవజీవం మసలునదే
ఇది తొలకరి పైరుపాట

కొత్తశక్తి ఇచ్చె బలే!
కొత్తశక్తి తెచ్చె బలే!
వానకారు క్రొన్నెత్తురు
మరిగి ఉజ్వలించినదో
ఎదతలపుల కైపుపాట.

# ఆకాశవాణి

తెల్లవారింపయ్యా సామీ
ఎల్లలోకము మేలుకాంచెను,
ఎల్లలన్నీ చెరిగిపోయెను,
కల్లగాదోయా!

కలిమిగలవారలకు నేటికి
చెలిమి జగమున కరిగిపోయెను;
శోకబాధా తప్తమయి ప్రజ
మోకరిల్లెసికనే!

కల్లకపటం వల్లకాదోయ్—
చెల్లిపోయెను చెడ్డరోజులు;
ముళ్ళకంచెలు అడ్డుగోడలు
పెళ్ళగించబడెన్.

దుష్టబుద్ధికినిజంగానే
కష్టకాలం సమీపించెను,
కష్టజీవికి జాతకంలో
నష్టపడెను శనిగ్రహం.

మోడులన్నీ పల్లవించును,
బీడులన్నీ పుల్లవించును.
కీడులన్నీ తుల్లగిల్లును,
చూడు ముందుగతిన్!

చకుచింతల లోతులో పడి
చీకటింట్లో ఊపిరాడని
రాణివాసపు బ్రతుకు గడచెను
జ్ఞానసుందరికిన్.

ఒళ్ళు దులుపుక, కళ్ళు నులుముక
తృళ్ళిపడి లేచింది లోకం;
లెమ్ము నరుడా! జ్ఞానసుందరి
నిన్నె కాంక్షించెన్.

లెమ్ము నరుడా! నిద్రవిడువుము,
వమ్ముసేయకు మంచిసమయము,
లెమ్ము — తూరుపు పసిడివెలుగులు
చిమ్మినది చూడన్.

## స్వస్తి

స్వస్తి ప్రజాభ్యపరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేనమహిన్మహీశాః
లోకాస్సమస్తాస్సుఖినోభవంతు.